# 63. శబ్దవైచిత్రి

## ROMANCE OF WORDS

సాధారణంగా పదముల వెనుక ఒక కథ ఉంటుంది. అది తెలుసుకోవడానికి ఆ పదం యొక్క ధాతురూపం, సజాతీయ పదాలు, సహచర పదాలు ఉపకరిస్తాయి. భాషాశాస్త్రజ్ఞులకు సామ్యము, లోకనిరుక్తి , ఊనిక మొదలగు ప్రక్రియలతో పాటు ధ్వనితౌల్యము, అనునాదశబ్దం వంటి ప్రక్రియలు సహకరిస్తాయి. ఉదా॥ కల్ల = అబద్ధం, బొల్లి = అబద్ధం. కల్లిబొల్లిమాటలు అనే పదబంధంలో ధ్వనితౌల్యం (ఫోనెటిక్ బాలన్స్) కోసం 'కల్ల' 'కల్లి' అయింది. ఆస్తిపాస్తులు అన్నప్పుడు 'పాస్తి' అనునాద శబ్దం. దీనికి ప్రత్యేకార్థం ఉండదు కాని ఊతము అర్థపుష్టి కలిగిస్తుంది. ఈ మార్పులు చిత్రవిచిత్రంగా ఉంటాయి కనుక ఇది శబ్దవైచిత్రి.

* * * * *

## పదవరుస

1. అమ్మ - అయ్య
2. అ౦ట
3. అటుకులు
4. అండి/అండీ
5. అనఁగి పెనఁగి యుండు
6. అఱచు - అంకె
7. అలమేలుమంగ
8. అలవోకగా
9. అలుపు సొలుపు
10. అల్లకల్లోలం
11. అల్లిపువ్వు
12. అల్లుడు
13. అవును - కాదు
14. ఆనక
15. ఆనుపానులు
16. ఆంబోతు
17. ఇబ్బంది
18. ఇరుగు పొరుగు
19. ఉక్కిరిబిక్కిరి
20. ఉఋసు - ఊసు
21. *ఏత్-
22. ఒడ్డాణము - నాను
23. కంచి
24. కల్లిబొల్లి మాటలు
25. కాబట్టి

**26.** కాలడి

**27.** కునికిపాటు

**28.** కొత్త

**29.** కొలను - కొలఁకు

**30.** కాటమయ్య - కాట్రేడు

**31.** కూనలమ్మ

**32.** *కొల్-

**33.** కొసరు

**34.** కోవెల - కోనేరు

**35.** గడప

**36.** గొనకొను

**37.** గోదాదేవి - ఆళ్వారు - ఆండాళ్ - తిరుప్పావు

**38.** గ్రుచ్చు

**39.** ఘూర్ణిల్లు

**40.** చాలెత్తు

**41.** చిక్కు

**42.** చిట్టెలుక

**43.** చిమ్మచీకటి

**44.** చీమ చిటుక్కుమను

**45.** చీకటి, ఒకటి, ఏమిటి

**46.** చుట్టము

**47.** చెన్నపట్నం

**48.** చెఱ - చెఱువు

**49.** తగువు - తగవు

**50.** తప్పక

**51.** తరుణము

**52.** తాటాకు

**53.** తావళము

**54.** *తిర్–

**55.** తూర్పు

**56.** తెప్పలదేలు

**57.** *తెళ్–

**58.** తేఁటి

**59.** తొడతొక్కిడి

**60.** తొలకరి

**61.** తోక

**62.** దాకా

**63.** దాగు – దాచు

**64.** దిక్కుమాలిన

**65.** నాగ

**66.** నాంచారు

**67.** నూఱారు – వెయ్యారు

**68.** పంగనామము

**69.** *పచ్–

**70.** పట్టె వర్ధనము

**71.** పడు

**72.** పాటుపడు

**73.** పడిగాపులు కాయు

**74.** పోయిరావలయు మాకు

**75.** పాచిపని

**76.** పాఱ

**77.** పగులు – పాలేరు

**78.** పిసరంత - కాస్తంత - రవ్వంత

**79.** పుక్కిటి పురాణము

**80.** పురుగు-పుట్ర

**81.** *పెర్- / *పేర్-

**82.** పొరపాటు - పొలమారు

**83.** పోతు

**84.** ప్రక్క

**85.** ప్రసాదము

**86.** బోర్లపడు

**87.** మందు-మాకు

**88.** మనసారా

**89.** మరదలు

**90.** మతి

**91.** మా

**92.** మాట

**93.** మామిడి

**94.** మిక్కిలి

**95.** మినుకు

**96.** మిన్నక

**97.** చలివెలుగు

**98.** *మూ-

**99.** మ్రొక్కు

**100.** రుద్దు - రుబ్బు

**101.** సవరించు - అమర్చు

**102.** సాగుబడి

**103.** సుమా - సుమీ

**104.** వంచు - వాంచు

**105.** వఱువట్లు వట్టు

**106.** వలయును

**107.** వాక్రుచ్చు

**108.** వాడివత్తలగు

**109.** వాలుగంటి

**110.** వారు - గారు

**111.** విరియకాచు

**112.** విశాఖపట్నం

**113.** వీడ్కోలు

**114.** వెన్నెల

**115.** వెల్లడించు

**116.** వేడుకొను - వేడుక

**117.** వేనకువేలు

**118.** వ్రేలాడు

**119.** బేకు–సాకు

**120.** నంజుడయ్య, ఉణ్ణాములై

## 1. అమ్మ – అయ్య

అమ్మ= తల్లి, పూజ్య స్త్రీ. # అయ్య < సం. ఆర్య = తండ్రి, పూజ్య పురుషుడు. # అమ్మాయి = చిన్న పిల్ల, కూతురు.(అమ్మ +ఆయి< తాయి). # అబ్బాయి = పిల్లవాడు, కొడుకు (అబ్బ= తండ్రి + ఆయి ). # అమ్మి= సాదర హీన స్త్రీవాచకం (అమ్మ+ ఇ). # అబ్బి = సాదర హీన పురుషవాచకం (అబ్బ +ఇ). అప్ప = తండ్రి, జ్యేష్ఠ సోదరి.

అన్నాదులు = బంధువాచక శబ్దాలైన అన్న, అక్క, అమ్మ, మొదలగునవి. అన్నాదులు ఒకదానికొకటి చేరి వ్యక్తి నామాలుగా వ్యవహరిస్తాయి. ఉదా॥ అన్నక్క, అక్కన్న, అప్పన్న, అన్నప్ప, అక్కలమ్మ, అయ్యపయ్య, అయ్యప్ప (స్వామియే శరణ మయ్యప్ప).

'అయ్య' బంధువాచక శబ్దాలకు చేరి గౌరవ వాత్సల్యాది అర్థాలను తెలుపుతుంది. ఉదా॥ అన్నయ్య, అక్కయ్య, బాబయ్య, తాతయ్య మొ॥

'అయ్య' తద్ధర్మార్థక క్రియపై చేరి ప్రశ్నార్థక మవుతుంది. ఉదా॥ <మీా వంశమున నరదేవోత్తములైనవారు సద్ధర్మమార్గంబు సలుపుదయ్య, భార.>

ఆశ్చర్య, సంతాప, అనుకంపాద్యర్థంలో అమ్మ, అయ్య శబ్దాల వాడుక, ఉదా॥ అమ్మో, అయ్యో, అమ్మమ్మో, అయ్యయ్యో.

ఇట్లు తెలుగు అంతరాంతరాల్లోకి ఇంతగా చొచ్చుకొనిపోయిన అన్యదేశ్యము మరొకటి లేదు.

## 2. అంట

*అన్– ధాతువు. # అనుట > అంట= అనడం> అంట. ఇది వృత్తాంత కథనాదులను తెలుపుతుంది. <తన పేరు కుచేలుండట.. మీాకు పూర్వ సఖుండట, మీాతోనొనగూడి చదివినాడట. కుచేలోపాఖ్యానం>

### 3. అటుకులు

*అట్‌– ధాతువు. # అటుకులు < అటు+కళ్‌. కళ్‌ అనునది రెండు బహువచన ప్రత్యాయాల సమాహారం క్‌+ళ్‌. # అడంచు (<అట్‌+అంచ్‌ > డంచు > దంచు (డకారానికి దకారం). # ఆటు=దెబ్బ. # అగచాట్లు = కష్టాలు.

### 4. అండి/అండీ

గౌరవ సంబోధన ప్రత్యయం. ఉదా॥ నమస్కారమండి. ఇది మధ్యమ పురుష బహువచన ప్రార్థనార్థక క్రియ నుండి ఏర్పడింది. ఉదా॥ చేయు ధాతువు యొక్క మధ్యమ పురుష ప్రార్థనార్థక క్రియ చేయుండు. దీనికి 'ఇ, ఈ, అ, ఆ'లు వికల్పంగా చేర్తాయి (బాల. క్రియాపరిచ్ఛేదం. సూ. 33.) చేయుండు. స్వరవిభేదనం వలన చేయండి. ఇట్లే వండుండు > వండుండి > వండండి. ఈ రూపాలలో చివరవచ్చే 'అండి' గౌరవార్థక మనే భ్రాంతితో దీనిని విడదీసి ఇతర పదాలకు చేర్చడం మొదలు పెట్టారు. ఇట్లు అవునండి, కాదండి, ఏమండి, సరేనండి, మొ॥

దక్షిణాంధ్ర మాండలికంలో (తమిళ దేశంలో తెలుగువారు మాట్లాడే భాష) ఈ క్రియకు అకారం చేరింది కనుక చేయండ, కూచోండ ఇత్యాది.

### 5. అనఁగి పెనఁగి యుండు

*అణ్‌– ధాతువు. అంటు= సక్రి. తాకు, అక్రి. తగులు. ఉదా॥ అంటు మామిడి, అంటురోగం # అంట్లు = వండడంచేత అపరిశుభ్రమైన పాత్రలు. # అనగు – ఈ పదం 'పెనగు' తో కలిసే ఉంటుంది. అనఁగి పెనఁగి యుండు = కలసి మెలసి యుండు. పెనఁగు = చుట్టుకొను.

### 6. అఱచు – ఱంకె

*అత్‌– ధాతువు. # అఱచు= కేకవేయు. అఱుపు = కేకవేయటం. వర్ణవ్యత్యయంవలన క్రింది పదాలలో ఱ కారం పదాదికి జరిగింది: #ఱంకె=

ఎద్దు మొ॥ చేసే ధ్వని. # అజ్జు =వదరుబోతు. # అంతు = గోల, పెద్దధ్వని. [కొలా. రజ్ = అసందర్భంగా మాట్లాడు; క. అఱచు = బొబ్బరించు; త.ఆఱై=మాట్లాడు, ధ్వని,మాట]

## 7. అలమేలుమంగ

అలరు=పుష్పించు, వికసించు, సంతోషించు. వి.పుష్పం (వికసించేది). # అలరించు=సంతోషపెట్టు. # అలరుబోడి=పుష్పంవలె మనోజ్ఞురాలైన స్త్రీ. పోడి–పోడిమి శబ్దరూపం= చక్కదనం. అలమేలుమంగ (<త. అలర్ మేల్ మంగై) పద్మంమీద ఆసీనురాలైన దేవి, పద్మాసన, శ్రీవేంకటేశ్వరస్వామివారి దేవేరి.

## 8. అలవోకగా

*అళ్– ధాతువు. # అలవి=శక్తి, సామర్థ్యం, బలం. # అలవోక= (అలవు+పోక) విణ. మందం, అల్పం. దీని క్రియావిశేషణం అలవోకగా= అవలీలగా, అనాయాసంగా.

ఈధాతువు నుండి ఏర్పడిన మరొక పదం లావు, వి. బలం, సామర్థ్యం
<ఈశు మహిమ నీకెఱుగ లావె>
[త. అళ్=బలం, ధృఢత్వం]

## 9. అలుపు సొలుపు

అలయు= శ్రమపడు, విసుగుచెందు. # అలపు=ఆయాసం, పారవశ్యం, బడలిక. # సొలుపు= సోలిపోవడం. 'అలపు' సొలుపుతో ధ్వనితౌల్యం కోసం 'అలుపు' అయింది.

## 10. అల్లకల్లోలం

అల=తరంగం. # అల్లాడు=చలించు, కలతచెందు. # అల్లకల్లోలము= తారుమారైనది, కలతచెందినది, (సం. కల్లోల=పెద్ద అల).
ధ్వనితౌల్యం కోసం 'అల' 'అల్ల' అయింది.

## 11. అల్లిపువ్వు

అల్లిపువ్వు=ఒకానొక జలపుష్పం. <అల్లిలో నుదయించెనని ఎన్ని కుముదవల్లి నామం బిడి> # అల్లితో నేర్పడిన స్థలనామం తిరువల్లిక్కేణి, చెన్నైలో ఒక పేట పేరు. (తిరువల్లిక్కేణి <తిరు+అల్లి+కేణి). కేణి= చెఱువు. 12 సంవత్సరముల కొకసారి ఈ చెరువులో అల్లిపువ్వు పూసేదట.

## 12. అల్లుడు

అల్లుడు=కూతురు మగడు. ప్రేమాస్పదుడు అన్నది మూలార్థం అళియరామరాజు (శ్రీకృష్ణదేవరాయల అల్లుడు)
[క.అళియ=అల్లుడు; త.అళి=ప్రేమించు]

## 13. అవును - కాదు

* అ-, * అక్- ధాతువు. 'అ' ధాతువు నుండి ఏర్పడిన పదం అగు > అవు=కలుగు, జరుగు, నెరవేరు మొ॥ # అవును, ఔను= (తద్ధర్మార్థక క్రియ) అంగీకారాన్ని తెలుపుతుంది. # కాదు. ఈ రూపం 'అక్' ధాతువునుండి ఏర్పడింది. అక్+ఆ (వ్యతిరేకార్థక ప్రత్య.)+దు (సర్వనామప్రత్య.) > అకదు. వర్ణవ్యత్యయం వలన 'కాదు' = అనంగీకారాన్ని తెలుపుతుంది. అర్వాచీనకాలంలో అవు శబ్దంనుండి వ్యతిరేకార్థక క్రియ ఏర్పడింది. అవు+అ+దు= అవదు. అవదు, కాదు అనే రెండు రూపాలూ ఇప్పుడు వాడుకలో ఉన్నాయి.

## 14. ఆనక

*వెన్= ధాతువు. # వెనుక=వెనుకభాగం. క్రి.విణ. పూర్వకాలంలో. # ఆనక= తరువాత. # ఆ వెనుక > ఆనక.
ఇతర పదాలు: వెన్ను, వెంబడి, వెంబడించు.
[క.బెన్; త. వెన్]

## 15. ఆనుపానులు

* ఆన్– ధాతువు. ఆను= అ.క్రి. ఒరగు, స.క్రి. ఆశ్రయం చేసికొను. #ఆనుపానులు= పుట్టుపూర్వోత్తరాలు, శక్తియుక్తులు. పాను–అనునాద శబ్దం.

## 16. ఆంబోతు

* ఆ– ధాతువు. దీనికి 'వు' చేరి ఆవు అయింది. *cf* పూ–పూవు. ఒక కాలంలో ఏకాక్షర ధాతువులు ద్వ్యక్షర ధాతువులు అయ్యాయి. సమస్త పదంలో మాత్రం పూర్వరూపం నిలచి వుంది. ఉదా।। ఆ–లు= ఆవులు, ఆలమంద. ఆ శబ్ద రూపాంతరం ఆన్. # ఆన్ +పోతు >ఆంబోతు = యథేచ్ఛగా తిరగటానికి అచ్చుపోసి విడిచిన ఎద్దు. పశుజాతి సమృద్ధికి ఆవులతోపాటు ఆంబోతు ఇచ్చుట ఆచారం. <త్రిపురాంతకదేవర అఖండదీపానకు ఆంబోతూను నూరు గంగుగోవులను ఇచ్చితిమి>
[క. ఆ= గోవు, ఆకళ్ = గోవులు; త. ఆయ్ = గొల్లజాతి, ఆయన్ = గోపాలుడు. ఆయ్ప్పాడి = గోకులము. తమిళంలో వకారానికి బదులు యకారం వచ్చింది.]

## 17. ఇబ్బంది

*ఇత్– ధాతువు. # ఇక్కు (<*ఇర్–క్–)= సంకటం. ఇక్కు+ కట్టు ఇక్కట్టు = ఆపద, కష్టం. # ఇఱుకు. ఇఱి –విఱ. ఇఱికౌగిలి = బిగికౌగిలి. # ఇర్+బంది (< బంధ) > ఇబ్బంది.

## 18. ఇరుగు పొరుగు

*ఇర్– ధాతువు. # ఇరవు = స్థానం, ఇల్లు. # ఇరుగు = పక్కయిల్లు. ఇరుగు పొరుగు =చుట్టు పక్కలు, ఇంటికి రెండు పక్కల నున్నవారు.

*పొర్– ధాతువు నుండి 'పొరుగు' శబ్దం ఏర్పడింది. పొరుగు= దగ్గరనున్నది, పక్కనున్నది.

## 19. ఉక్కిరిబిక్కిరి

*ఉక్- ధాతువు. ఉక్క = వేడి (<ఉర్-క్). # ఉక్కపెట్టు (ఎండా కాలంలో గాలి లేక దేహం తపించు). # ఉక్కిరిబిక్కిరి= ఊపిరి ఆడకపోవడం, విశ్రాంతి లేకపోవడం. బిక్కిరి అనునాదశబ్దం.

## 20. ఉబుసు - ఊసు

ఉబుసు=పనిలేనికాలం. ఉబుసుపోవు=కాలక్షేపమగు. # ఊసు = జోలి, సంగతి (<ఉబుసు).< వాళ్ల ఊసు మనకెందుకు>

## 21. * ఏత్-

ఈ ధాతువుకు పైకిపోవు, ఎక్కు అనునది ప్రాథమికార్థం. ఏతము=నూయి మొదలగు వాటి నుండి నీళ్ళు పైకి తోడే యంత్రం.
గమనిక: మూల ద్రావిడంలోని దంతమూలీయ స్పర్శ త కారం తెలుగులో శకటరేఫగా మారుతుంది.

ఏఱ్+అమ్ (అనుబంధప్రత్య.) > ఏట్టమ్ > ఏతం. 'ట్ట' ఒకప్పుడు 'త' గా మారుతుంది.

ఏటికోలు=నమస్కరించు (చేతులుపైకెత్తి అనే అర్థంలో). # రేఁగు, రేగు= ఉద్రేకించు, విజృంభించు (<* ఏఱ్-క్). # రెచ్చు (ఏఱ్-చ్-) = విజృంభించు. పశువులు అదుపుతప్పి ప్రవర్తించు. # రేపు= ప్రాతఃకాలం, మరుసటి దినం. # లేచు=నిలబడు, మేలుకొను, పొటమరించు. # ఏదు= పోషించు, పెంచు. # ఎసగు= వృద్ధిచెందు, అతిశయించు. # ఎక్కు =పైకి పోవు. # ఎక్కువ=అధికం.

## 22. ఒడ్డాణము - నాను

ఒడ్డాణము= స్త్రీలు నడుముకు ధరించే నగ. ఇది ఏకపదం కాదు. మలయాళంలో ఒటిఞాన్= ఒడ్డాణము, ఒటి=నడుము, ఞాన్=తాడు. నాను=స్త్రీ కంఠాభరణం.
[త.నాణ్=తాడు, మంగళసూత్రం]

**23. కంచి**

కచ్ఛపేశ్వరుడు వెలసిన క్షేత్రం కనుక దీనికి కంచి అనే పేరు వచ్చింది. కచ్ఛప=తాబేలు. విష్ణువు పది అవతారాలలో కూర్మావతారం ఒకటి. కూర్మావతారంలో ఉన్న విష్ణువుని శివుడు ఇక్కడ పూజించినట్లు పురాణగాథ. పూర్వం కంచి దివ్యక్షేత్రమేకాక వైజ్ఞానికంగాను, సాంస్కృతికంగాను ప్రసిద్ధిగాంచిన నగరం. కంచంత కాపురము అని పలుకుబడి.

Ref. Kanchipuram and its environs- V.K. Seshadri, T.T.D. Publications.

**24. కల్లబొల్లి మాటలు**

పొల్లు= గింజపట్టని ధాన్యం, పొల్లుపోవు= వ్యర్థమగు. # బొల్లు = అసత్యమాడు. # బొల్లి=అసత్యం. # కల్లిబొల్లి మాటలు=అసత్యవచనాలు, మాయమాటలు.

ఇక్కడ కల్ల (=అసత్యం) శబ్దం 'బొల్లి' తో ధ్వనితౌల్యం కోసం కల్లి అయింది.

**25. కాబట్టి**

*పత్- ధాతువు. # పట్టు = పట్టుకొను. # పట్టుదల=అభినివేశం, వదలని పట్టు. # పట్టుకొమ్మ, పట్టుగొమ్మ=ఆశ్రయం, ఆధారం. # పట్టుమని= అవ్య. కనీసం (పట్టు+మ్(=ఆదేశం) +అని). # కాన్+పట్టి=కాబట్టి.
[క.పట్టు=పట్టుకొను; త.పట్టి=కూర్చి, గురించి (ద్వితీయావిభక్తి ప్రత్య.]

**26. కాలడి**

కాల్-అడి

కాలడి= కాలిపాదం, శంకరుల తండ్రి శివగురు, తల్లి ఆర్యాంబ. తల్లిదండ్రుల ఇలవేల్పు శ్రీ కృష్ణుడు. ఆర్యాంబ రోజూ కొంత దూరంలో ఉన్న పూర్ణానదికి వెళ్ళి స్నానం చేసి వస్తూండేది. ఒక రోజు అస్వస్థురాలై స్నానానికి వెళ్ళలేక చాలా బాధపడింది. చిన్ని శంకరులకు ఏం చేయాలో

తోచలేదు. తన ఇలవేల్పు శ్రీ కృష్ణుణ్ణి ప్రార్థిస్తే అన్నాడు 'పూర్ణానదినే అడుగు, నా అడుగుల వెంబడి తల్లి ఉన్నచోటికే రమ్మని,' ఆ మాట భరోసాతో పూర్ణానదిని ప్రార్థించాడు చిన్నిశంకరుడు. అంతే ఆ నదీమతల్లి అతడు ముందు నడుస్తుంటే అడుగుజాడల వెంట వెన్నంటి వచ్చింది. అలా వచ్చిన ఊరే కాలడి.

అరణ్యస్పందన, ఆధ్యాత్మిక మాసపత్రిక

## 27. కునికిపాటు

*కూ- ధాతువు. # కూరు = నిద్రించు. కూర్కు, కూరుకు (* కూర్-క్) = నిద్రించు, అల్పనిద్ర <కంటికిన్ గూరుకు రాదు>. కునుకు (<*కూన్- క్) = నిద్రచే తూగు, కునికిపాటు.

ఈ ధాతువునుండి ఏర్పడిన మరొక పదం -'గూను'= వీపు మీద వంపుగా ఉన్నభాగం- గూనివాడు.

## 28. కొత్త

*కొఴ్- ధాతువు. # క్రొ సమాసంలో ఉదా॥ క్రొన్నెల= బాలచంద్రుడు (<కొఴ్ -నెల). సంయుక్తంలో-ఴ్ కారం రేఫగా మారుతుంది. క్రొక్కారు (కొఴ్--కారు). క్రొత్త, కొత్త (కొఴ్--త) = నూతనమైన.

ఈ ధాతువు నుండి ఏర్పడిన ఇతర పదాలు: కోడలు, కొమ్మ(=ఆడుది), కొదమ =పశుపక్ష్యాదుల పిల్ల. ఉదా॥ లేడి కొదమ, తేటికొదమ.

## 29. కొలను - కొలఁకు

కొలను, కొలఁకు= చెరువు. ప్రాచీన బహువచన 'కళ్' ప్రత్యయంతో కూడిన శబ్దం యొక్క అనుచిత విభాగం వలన కొలఁకు ఏర్పడింది. కుళమ్+కళ్ > కులఙ్కళ్ >కొలంకులు >కొలఁకు-లు, ఏక. కొలఁకు.

[క. కుళం= చిన్నగుంట; త. కుళమ్= చెరువు]